శ్రీరస్తు.




శ్రీ రామచంద్రాయనమః

# మనోహితము

ఇది

## చదువుల వీరరాజుచే

రచియింపంబడి

లానోట్సు ముద్రాక్షరశాలయందు
ముద్రింపంబడియె..

పార్వతీపురం.

మొదటికూర్పు.

1911. [వెల-౧ అణా,

శ్రీరామచంద్రాయ నమః

# మనోహితము

శా॥ శ్రీరామా! జనకాత్మజా రమణ!
రాజీవాక్ష! దామోదరా!
యేరా కేశవ! మాధవా! నరహరీ!
నీవే దిక్కుఁ బ్రోవంగ నింక।
సంసారాంభోనిధినుండి తేల్చి మము
నీసాన్నిధ్యముం జేర్పుమా।
శౌరీ! కృష్ణ! యటంచు మూఢమనసా
శక్తిన్ హరిం గొల్వుమా॥ 1

మ॥ ధనముల్ గూర్చితి సంతతిన్ బడసినే
ధన్యాత్మతన్ బొందినా।
వనిలో నుబ్బియు విర్రవీగుటది యేలా?
సంతతుల్ సంపదల్।
కనులన్ మూసిన "టాపుటాపుగ"
నిరాఘాటమ్ముగాఁ బోవునో।
మనసా! మోక్షము హస్తమందిముడు
వేమారున్ హరిన్ గొల్వుమా॥ 2.

మ॥ మొలకల్ బుట్టియు దీర్ఘమై యెగసి
గుంపుల్ గూడి వృక్షమ్ములన్ ।
నలుదిక్కుల్ పడి యల్లి చుట్టుకొని
కానం బ్రాకుఁ దీవల్ గతిన్ ।
గలతం బొందఁగవృత్తి యాశలు
యహంకారం బటంచున్ భువిన్ ।
భళీ! యిట్లల్లఁగనేల? మూఢహృదయా!
భక్తిన్ హరిం గొల్వుమా॥ 3.

మ॥ కనులన్ జూచిన వెల్లఁ గోరుచునులో
గానెంతో మూర్ఖంపువ।
ట్టున పాపంబిది పుణ్యమిద్దియిది
గూడున్ గూడదంచున్ ధరన్ ।
మనసం బేమియులేక గుడ్డివలెదు
ర్మార్గంబుకే ద్రిప్పుదో।
మనవా బుద్బుద ప్రాయమానఁ గదు
సంసక్తిన్ హరిన్ గొల్వుమా॥ 4.

శా॥ నీవున్నన్ జగముండుఁ దానివలనన్
దీపించుఁ గర్మంబులా।
త్రోవన్ గల్గును జన్మముల్ భువిమహా
దుఃఖంబులున్ గుంపులై ।
లేవన్ గల్గును నీవుపోవ జగముల్
డిందున్ గదా! కర్తతో।

వేవేగన్ జని భక్తితోడ ...న

వేడ్కన్ హరిన్ గొల్వుమా॥ 5.

మ॥ ఒకటిన్ గోరియు లభ్యమైన బిదపన్
యొక్కొక్కటిన్ మెల్లగా।
సకలంబున్ దుదకిచ్చ యింతువటులన్
సంతుష్టి లేకుండ నో।
క్కొకరీతిన్ జరియించి దుఃఖవసధి
నోలాడుటల్ నైజమో?
‡వృకముం బోలి చరింప నేలమనసా?
వేడ్కన్ హరిం గొల్వుమా॥ 6.

శా॥ నానాయోనులఁ బుట్టిగిట్టుచును
నన్యాయంపు మార్గంబులన్।
నానా రీతుల సంచరించి కడువంతం
బొందఁగాఁ జేయుటల్।
నీనైజంబిదియంచుఁ దెల్పెదవు చాల్
నీచెల్మి నీకల్మియున్।
నేనాశింపఁగలేదు వెఱ్ఱిమనమా?
నెమ్మిన్ హరిం గొల్వుమా॥ 7.

మ॥ పలలంబున్ దినఁ జూచి డేగ; పలలో
బడ్డట్లు నీప్రేరణం।

---

‡తోడేలు అనగా ముసలినక్క.

బుల మన్నింపుచు నాలిబిడ్డలపయిన్
మోహంబునన్ గుంది సం।
కెలలోఁ జిక్కితి మోసపోతినయయో!
కీడ్పాటులం బెట్టగా।
ఫలితం బేమి గలుంగు మూఢహృదయా!
భక్తిన్ హరిన్ గొల్వవా॥ 8.
శా॥ మేడల్ గట్టెద; భూములన్ గొనెద;
ఁబేర్మిన్ గీర్తిచే విత్తమున్।
గూడం బెట్టెదనంచుఁ గోరెదవయో!
గొంతెమ్మకోర్కెల్ వడిన్।
కూడున్ గుడ్డయుఁ దక్క వేరొకటి
నీకున్ గోరగానేల? ఛీ!॥
*వ్రీడన్ జెందని జన్మమేల? మనవా
వేడ్కన్ హరిన్ గొల్వవా॥ 9
శా॥ పాపంబుల్ సుఖమంచుఁజూపి భ్రమలన్
బంధించి యంతంబునన్
రూపుంజూపవు బాధలన్మునిఁగి
మొఱ్ఱో!. యంచు నేడ్వంగనీ।
కాపట్యం బికనేమి చెప్పుదుధరన్
గన్పట్టుఁ జోద్యంబులై।
వ్యాపారత్వముమాని మూఢహృదయా!
భక్తిన్ హరిం గొల్వవా!॥ 10.

---

*లజ్జ

శా॥ నీసాంగత్యముఁ బూనియుండఁ జనముల్
నిందించుచున్నారునన్।
దోసుండంచను మూర్ఖచిత్తుఁ డనుచున్
దుర్మార్గుఁడంచున్ భళా!
మోసంబయ్యెను దుఃఖముల్గలిగెని
ర్మోహత్వమున్ లేదుచాల్।
నీసాంగత్యముఁ గోరలేదు మనసా!
నెమ్మిన్ హరిం గొల్వుమా॥ 11.

శా॥ పల్లెల్, పట్నము, లిండ్లు, వాకిళులు, నే
పై యొప్పు సౌధంబులున్।
తల్లుల్, దమ్ములు, చెల్లెలన్నమరుదుల్
దారాది సద్బంధుగుల్।
కల్లల్సుమ్మిసుమంతయైన నిజమై
గనపట్టదెప్పట్టునన్।
మల్లుల్ వ్రాలి చలింప నేల? మనసా!
‡మాశ్రీహరిన్ గొల్వుమా॥ 12

శా॥ ప్రారబ్ధం బెటులుండు నట్టులనె
నైశ్వర్యంబు సేకూరునీ।
యారాటంబిటు పూననేల? పయికం
బార్జింప లేదంచుమున్।

---

‡లక్ష్మీయుక్తుడైనటువంటి

రారాజుల్ చనలేదా? వెంటనొక
గోరంతైన గొంపోయిరే?।
శ్రీరామాయని కేలుమోడ్చిమనసా
శ్రీశున్ హరిం గొల్వుమా॥ 13.

శా॥ ఈజన్మంబునఁ గొల్వకున్న మరినీ
కే జన్మమందబ్బునీ।
వేజన్మంబున నెట్టుపుట్టుదువొ?
నీకే రోగముల్బాధునో।
యోజిన్ నిల్చినబంటు జీవమకటా!
యారాట మింకేల శ్రీ।
రాజా! యంచు నుతించి మూఢమనసా!
రామున్ హరిన్ గొల్వుమా॥ 14

శా॥ *జుట్టున్ గుజ్జుగఁ గత్తిరించి పయిపైఁ
“షోకుల్ చెలాయించి” మేల్।
బట్టలట్టుచు సెంటుతుంపురుల
నాపైఁజల్లిలేఁ జూపుతో।
§ఁజిట్టాడంగను జూతువిద్దిసతమా?
చేఁజిక్కవై నస్యాతుం।
“డిట్టే” పాశముఁ జట్టిలాగుమనమా!
యెట్లో హరిన్ గొల్వుమా॥ 15.

*Croping head. § Wandering.

మ॥ భవనంబుల్ మృదుపాన్పులున్ సుతులు
సత్పౌత్రుల్ ధరన్ గల్గినన్।
యువతుల్ బంచకు వేతురంతకును న
నత్యౌన్నత్యముం బొందినన్;
భువిసంపాదనఁ జేయు నంతవరకే
పుత్రుల్ హితుల్దారలుం।
చవలీలన్ గణుతించి మూఢమనసా!
యయ్యున్ హరిన్ గొల్వుమా॥ 16.
శా॥ కొంపల్ దీయుచుఁ గోట్లలెక్కుచు మహా
ఘోరంబులన్ జేయుచున్।
సంపాదించిన విత్తమెల్లయువతీ
సాన్నిధ్యమున్ జేర్పనిన్।
బలుపున్ సూత్రముఁగూడఁ దెంచితుదకున్
బాపంబె తోడౌను చావన్?
చంపల్ గట్టిగఁ గొట్టుకొంచుమనసా!
శక్తిన్ హరిన్ గొల్వుమా॥ 17
మ॥ పరకాంతామణులెల్లఁ దల్లులని
సంభావించి పైవిత్తమున్।
గరళ ప్రాయముగాఁగ నెంచుమని
వేడ్కన్ జెప్పుసం బుద్ధులన్।
సరి; యట్లే యొనరింతునంచు; శిరము
త్సాహంబుతోఁ ద్రిప్పి సు।

స్థిరతన్ శ్వాసముఁబోలనేల? మనసా!
సేవ్యున్ హరిం గొల్వుమా॥ 18.

శా॥ చొంగల్ గ్రమ్మఁగ బెక్కు బెక్కుమని
సంక్షోభంబుచేఁ గుండియూ।
ల్లంగన్ వైద్యులు నిస్పృహాత్ములయిన
నిన్ గాంచన్ యముఁడంతలో।
“కంగారెత్తుచు” వచ్చునప్పుడయయో!
కన్పట్టరెవ్వారు మఱి।
గొంగున్ బంగరుమూఁటఁగాదె? మనసా!
క్షోణిన్ హరిన్ గొల్వుమా॥ 19

మ॥ సకలంబున్ గొరిగింపనేల? దొరవా?
సన్యాశివా? మోమునం।
దొకకొంచంబైనను బొట్టుఁబెట్టవది
యేమో? ముండవా? చూడదు।
శ్శకునంబంచు దలంతురేమొకద?
నీచంబై ననీజీవనం।
ఔక సెక్కమ్మనినమ్మి మూఢహృదయా?
యీశున్ హరిన్ గొల్వుమా?॥ 20

మ॥ పరకాంతన్ గనియాసఁ జెందకయయో?
పాపంబె వాటిల్లున।
త్పురుషుల్ మెచ్చరు; ఛీ! యటంచునవనిన్
దూషింతురెల్లప్పుడున్।

గరవాలంబుల శిక్షసేయుఁబలు
ముక్కాల్గాఁగఁ గాలుండిసీ!।
పురుషుల్ పుట్టనియేవగించి మనసా
ప్రాజ్యాహరిన్ గొల్వవా॥ 21
మ॥ నరలోకంబునఁ బుట్టి మందమతివై
జ్ఞానంబులేకున్ననే
సరణింబోదువా? దిక్కుమాలియకటా।
జన్మంబులెన్నో వ్రియున్।
వరుసన్ గల్గునా? వాటికన్నిటికి దే
హ్రాధాన్యమై యొప్పు; వే।
కరముల్ మోడ్చుచుఁ జెంతఁ జేరిమనసా!
కాంక్షన్ హరిన్ గొల్వవా॥ 22
శా॥ భక్తుల్ జెందిరి రామచంద్రుపదమున్
బ్రార్థించి సద్భక్తినా
సక్తిన్ వేడఁగ నీవుగూడ నటులే
సాధింపఁ గావచ్చుఁగ
క్తుర్తుల్ మానుముస్వల్ప సౌఖ్యములతో
గొట్లాట నీకేలఖీ।
యుక్తుల్ సెప్పఁకుమింక మూఢ మనసా!
యోజన్ హరిన్ గొల్వవా॥ 23
శా॥ అందంబైన ముఖంబటంచుఁబలు
మారద్దంబులోఁ జాచిపొ

లోఁపొందర౯ దుస్తులుఁ గట్టిగంధమును
నత్యుత్సాహత౯ బూసి బల్।
చిందుల్ద్రొక్కెడవయ్యొ? కొట్టకొన
కర్చిన్ జేరు దేహంబు ఛీ! ।
పందుల్గూడను ముట్టఁబోవుమనసా!
భక్తి౯ హరింగొల్వుమా॥ 24.
శా॥ కాలం బెంతఁగ లేదు? కొందర
పడంగా నేల? ముందెట్టులో।
శ్రీలోలుఁ౯ భజియింతునంచుఁ దనలో
జింతింపఁగా నుగ్రుఁడై।
కాలుండే మరుపాటున౯ గదసి
జోక౯ ప్రాణముల్డీయునా।
వేళ౯ జేయఁగ నేమికద్దు? మనసా!
వేడ్క౯ హరి౯ గొల్వుమా॥ 25.
శా॥ కార్యంబుల్సమకూడ నేనని
యహంకర్తృత్వముం బూనియు।
కార్యంబుల్చెడిపోవఁ గర్మమని, లో
గా దైవముఁ౯ దూరుచు౯।
ధైర్యంబెయ్యెడ లేకఁ జేయుదువయో?
తర్కింప నింకేల? నీ।
వార్యుల్గొల్చిన రీతిమూఢహృదయా!
హాళి౯ హరింగొల్వుమా॥ 26.

శా॥ ఏపాపంబులఁ జేసినావొ యటులే
యిక్కట్లు ప్రాప్తించునీ।
వేపారంగసుబుద్ధితోఁ గలసి ఛీ!
యింకేల సంసారము।
చాపద్భ్రాతుని గొల్వకున్నఁ గలదే?
యాధారమయ్యయ్యో? ని।
ష్పాపత్వంబున సేవఁ జేసి మనసా!
భక్తిన్ హరిన్ గొల్వుమా॥ 27.



(మనోపరమున్ను విటకానిపరమున్ను)

—:బ్యాంకుస్వరం:—

బిళ్హరిరాగం–ఆదితాళము.

రామునిపదములు మరువకుమా! రంగేళిగాఁదిరుఁగకుమా॥ పల్లవి॥

కాముకులందరు బడియెడుపాట్లు కన్నులఁ జూచుచునుండఁగ లేదో?॥రా॥ అనుపల్లవి.

ఘడియ ఘడియకు మారెదవేమె ఘడియో? క్షణమొ? నీబ్రతుకు। మిడిసి మిడిసి పడియెదవయ్యో మిథ్యయనినమ్ముమా! ॥రా॥ ౧.

ఎందరెంద రేగుటయో మందమతి! గానవా? కందుకమువలెఁ దూలికానఁగరావు క్రిందుమీదు ॥రా॥ ౨.

పాపమన్న భయములేదు పాపినిన్నుఁ జూడఁగరాదు। రూపుమాపెద నిన్నుబట్టి పో! పో! పురమువెడలి॥రా॥ 3.

ప్రేమమీర, రాఘవునేలు రాముడుండ నేమికొదువ కామితార్థము లొసఁగు నీకుఁగాననమ్ము; నామాట ॥రా॥ ౪.

శంకరాభరణము–ఆదితాళము.

కాటికిఁ బోయేసరుసకు నీకు సొగసు లేటికే॥పలవి॥

ధాటిగశ్రీరామరామరామయంచు దలచవేటికీ ॥అ
నుపల్లవి॥
సబ్బుతోడఁ దోమి నిబ్బరంపు నడక తబ్బిబ్బులా
డుచు నడిచేవురా?
గొబ్బున యమభటులు గొరగొర నిన్నీడ్వ ‘‘స
బ్బుగిబ్బు’’ లన్ని యేమౌనయా ॥కా॥ 1.
మల్లుపంచఁ గట్టి మల్లిపూల బెట్టి చల్లని వెన్నెల
దిరిగేవురా?
ముళ్లరాళ్లలోన కింకరులీడ్వఁగ వళ్లి మొల్లల
న్ని యేమౌనయా ॥కా॥ 2.
కాంతలఁ జూచుచు వింత ‘‘ముస్తాబై’’ సంతసప
డియెదు వేల?
అంతకుండు నిన్ను హంతయొనర్పఁగ వింతము
స్తాబంత యేమౌనయా? ॥కా॥ 3.
దేవుడు లేదు; దెయ్యము లేదు; పోవోయి ‘‘నా
న్సెన్స’’ నెదు।
చావుకుసిద్ధమైయున్న నిన్బాధింప పోవోయి నా
న్సెన్సే మౌనయా ॥కా॥ 4.
రయమున భక్తులఁ గాచునని వీరరాఘవదానుఁ
డు సెప్పె;
నయముమీర రామనామముఁ దలచిన భయము
లన్ని తొలఁగి పోవునయా ॥కా॥ 5.
సంపూర్ణము.

